

శ్రీరస్తు.

# జ్యేష్ఠాదేవి కనిష్ఠాదేవి పరిచారములు.

(పెద్దమ చిన్నమ చరిత్ర)

నవరత్నగ్రంథమాల — [illegible]వది.



ఇది

మ॥ రా॥ రా॥ శ్రీ పీఠికాపురసంస్థాన [illegible]

శాల ట్యూటరు బ్రహ్మశ్రీ పెద్దాడ చిట్టిరామయ్య గారిచే రచితము.

మ॥రా॥రా॥శ్రీ కీర్తిశేషులయిన చెలికాని వెంకట్రాయణిం గారిధర్మపత్ని గారగు మ॥రా॥రా॥ శ్రీ కీర్తిశేషురాలగు లక్ష్మీవెంకయ్యమ్మరావుగారి జ్ఞప్తిసూచకముగ సమర్పింపబడినది.

శ్రీవారి పుత్రులగు మ॥రా॥శ్రీ ధర్మకొండలరావుగారు వగైరాల ధనసహాయముతో చిట్టిరామయ్యగారిచేత శ్రీవిద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు ముద్రితమై ప్రకటింపబడెను.

మొదటి కూర్పు — 1000 ప్రతులు.



1917 సం॥] [వెల ప్రతి 1 కి రు 0-1-0.



# అంకితము.



తటాకం ధననిక్షేపమ్
బ్రహ్మస్థాప్యం శివాలయమ్
ఆరామకృతికూపాశ్చ
సప్తసంతానసంజ్ఞకాః.

ఇట్టిసంతానములలోన నెక్కుడైన
లలితకృతినెంచికొనుట సత్కులజునకును
ధర్మమనియెంచి చెలికాని ధర్మమూర్తి
చినజగన్నాథరావెంత చెల్వమీఱ.

తల్లిఋణము దీర్చుటకై
బల్లిదుఁడగుసుతుఁడుచాల భక్తి మెరయఁగా
మెల్లన చెలువురతోడుతఁ
జల్లఁగ నూహించికొనిడు శాశ్వతపుఁగృతిన్.

శ్రీరస్తు.

# జ్యేష్ఠా దేవీకనిష్ఠా దేవీప్రచారములు.

## (పెద్దమ్మ చిన్నమ్మల చరిత్రము.)

## 1 టి భాగము.

### జ్యేష్ఠా దేవతా విలాసము. (దౌర్భాగ్య దేవతా ప్రభావము.)

"లేక లేక లోకాయపుట్టగా లోకాయకన్ను లొట్టపోయెనట." (లోకసామెత.)

(ఇందుకొక యుపాఖ్యానము. 3 పరిచ్ఛేదములు.)

### 1 టిది:— పీతాంబరధరరావు.

1. కొంతకాలముక్రిందట సోమేశ్వరుడు సోమిదేవి యనువృద్ధబ్రాహ్మణదంపతులు ధర్మపురియను పురంబున నివసించిరి. లేక లేక చాలకాలమునకు 40 సం॥ల వయస్సున వారికి

నొక పుత్రుఁ డుదయించెను. ఆశిశువు అంగసౌష్ఠవమును, సౌందర్యమును గలవాఁడు. కాబట్టి యతఁడు జనించినయిరువదియొకటవదినము శుభలగ్నమందు భారసాలోత్సవము నిర్వర్తించి యాబిడ్డకు

“పీతాంబరధర రావు”

అని వ్యావహారికనామమొసంగిరి.

2. తల్లియగుసోమిదేవి యల్పముగఁ జదువుకొనినసాక్షరురాలు కాఁబట్టియును సామాన్యమగు తెలివిగలస్త్రీ యైనందునను పైపేరు నోటఁబట్టలేక తనముద్దులబిడ్డను “బంగారు తండ్రి” యనుముద్దుపేరుతోఁ బిలుచుచుండును.

3. పసిబాలుఁ డగుటచేత 4-5 దేండ్లవయసుగలవాఁ డగువఱకు నాతనిసుగుణము

లు బైట పడనందున సతనిచర్యలయొక్క గు
ణదోషములను సరకుఁగొనక తండ్రియు నిరు
గుపొరుగువారును పీతాంబరధరరావనియే ము
ద్దుముద్దుగాఁ బిలుచుచుండిరు. ఏదియైన చె
డ్డపనిఁ జేసినపుడెల్ల తండ్రి తనప్రియపుత్రుని
తప్పుత్రోవలను మాన్పుటకై ముక్కునఁ జూ
పుడు వ్రేలానుకొని కూడదనుసంజ్ఞచేత వారిం
పుచుండును.

4. ఆరేడుసం॥ల వయసువాఁ డయినప్పు
డు వీథిలోనికి జామి, రేఁగు, నేరేడుబండ్లన
మ్మఁ దెచ్చిన స్త్రీలకు బియ్యము, ధాన్యము,
గుప్పెడుచొప్పున వెలఁబోసి కొనినప్పుడు
హస్తలాఘవముతో 2, 3, 4, చొ॥ గంప
లోనివండ్లెత్తికొని పారిపోవుచుండును. ఒక్కొ
కతటి పండ్లదానికన్నుఁగప్పి చౌర్యము చే

యుచుండును.

౫. మఱియొకప్పుడు బియ్యము ధాన్యము నిండుకొన్నప్పుడు తల్లియొద్ద కాసువీసములు లేనపుడును ధాన్యపు బియ్యపు వెలలకు కొనుని తరబాలురతోఁ బోయి గంపచుట్టు మూఁగికొనియున్నవారినందఱిలో పండ్లవానిని మోసముచేసి 3, 4, 5, చొ॥ పండ్లు తస్కరించి తల్లికిని వేదనచేయుచుండును. నిర్భాగ్యురాలగు నాయబల యది తప్పని మందలింపలేక "నా ముద్దులబంగారు! ఎన్నిపండ్లు తెచ్చితివిరా? ఆహా!" యని తాకీఫుచేయుచుండును.

6. ఇంకొకప్పు డీదుండగీఁడు తిండిమెర చేత తసచేత దుడ్డు, దుగ్గాని చిక్కనపుడును ఇంట గింజలు లేనపుడును గూళ్లు బల్లసొరుగులు తడుములాడి అందుసంరక్షకులు దాఁ

చి పెట్టినసొత్తు పైన, అరకానిచొప్పున తస్క
రించి పులిసినఅట్లు కారపుశనగలు మురుగు
డు నేతిపకోడీలు పులియూవడలు కొని మెక్కు
చుండును. దైవవశమున రోమకూపముల
గుండ శ్వాసకోశములగుండఁ జొరబడుపరి
శుద్ధమగుప్రాణవాయువు తప్ప వ్యాయామ
మనఁగ నెద్దియో దేహపరిశ్రమమన నెట్టిది
యో వానికిఁ గాని వానితలిదండ్రులకుఁగాని
తెలియనే తెలియదు. ఇట్టిహేతువువలన వా
నియాహారమలకోశములు మురుగుడుగదులం
బోలి యుండును. కడుపునొప్పి కాలునొప్పి
వచ్చునపు డెద్దియో యొకమాత్ర నిచ్చి
తల్లి మాన్పుచుండును. ఏకపుత్రవిషయము
గుటచేత వానితల్లి వానితప్పిదములు వెల్లడి
యయినచో వానితండ్రి వానిం గొట్టునను భ

యము చేత వానిదోషములు మాటుపరచు
చునే యుండును. వానిదుర్గుణములకుఁ దోడు
చెడ్డబాలురసహవాసమే వానికి మెండుగ
ఘటింపుచుండును.

7. బాల్యావస్థలోనె తప్పులకు దండనవి
ధింపఁబడక మరింత ప్రేరణయే తటస్థించు
నపుడు వాయువుతోఁ గూడినయగ్నివలె దుర్బు
ద్ధి పెచ్చుపెరిఁగి వానికి చెరుపునే చేయుచుండు
ను. కనుక క్రమక్రమముగ పీతాంబరధర
రావు చెడ్డజతగాండ్రతోఁ జేరి మఱిమఱి చెడ్డ
పనులే చేయఁ బ్రేరేపింపఁబడుచుండును.

8. తండ్రిసోమేశ్వరుఁడు కొంచెపుగుత్తప
నులు నెరవేర్చునొకకంట్రాక్టరుగ నుండి సం
సారము భరించువాఁ డగుటచేత ధనసంప
త్తిలేక తనకొడుకును చదువులలో సాకుమని

తనధర్మపత్నికే యొప్పగించెను. కాని బడిచ
దువులలోఁ బెట్టలేదు.

9. ఇట్టిస్థితిలో కొంతకాలము గడవఁగ
కొడుకునకు 12 సం॥రములయీడు ఘటించె
ను. ఒకనాఁడు పదిమందిబాలురతో వర్షర్తు
వునందు నేరేడుపండ్లకై షికారువెడలి తోఁ
టలలోను పుంతలలోను రస్తాలలోను పెరిఁగి
యున్న నేరేడుచెట్లకాలుపండ్ల నేరుకొని తిను
చు మంగములు కట్టుచు ధర్మపురసమీప
గ్రామమున నొకయల్లనేరేడుచెట్టున దొండ
కాయలంతపండ్లతో ఫలభరితములైనదాని
వాలుకొమ్మలం జూచి యుబ్బి పీతాంబరధ
రరావు మరిముగ్గురబాలురతో నెగసిపడి చె
ట్టును జేరి కాలుపండ్ల నేరి నోటవేసికొనుచు
నాబతీరక తలయొకయడ్డెడుపండ్లచొ॥ మంగ

ములు కట్టుకొనిరి. ఆ చెట్టు సాధారణమగు నేరేడు చెట్టుకాదు.

మనదేశమునందు నేరేడుపండ్లనిమిత్తమై వర్షకాలములో పిన్నపెద్దలు షికారుపోవుట దేశరివాజై యున్నది. అది నేరమును గాదు. అయిన నౌకరికావుదలలో నున్నయల్లనేరేడు చెట్టుఫలము తేరుట రాల్చుట నేరమగును. మఱియు నాయబ్బురపు చెట్టుయజమానుఁడు బహుశ్రద్ధతో నావృక్షమును తనహాదులో నిడికొని యొకతోఁటమాలియొక్క కావుదలలోనుంచెను. ఆ చెట్టుయజమానుఁడు సంపన్నులు, సామంతులు, ఉద్యోగస్థులు, మొదలగుబలియురకు పండ్లను, నజరానాలుగ నిచ్చి తనజీవనోపాధి సంపాదించుకొనుచుండును. ఈపండ్లు బజారులోనికి వచ్చుట య

రుదు. కాని అందుఁ జిక్కినను కానికి 4, 5, పుంజీలకంటె హెచ్చుగ విక్రయింపరు.

10. పైన వివరించిన నలుగురుబాలురు వారికి మొనగాఁ డగుపీతాంబరధరరావుతోఁ బట్టుపడఁగా తోఁటమాలి వారింబట్టి తనయజమానికి నొప్పగించెను. మండిపడి యాపండ్లఖామందు వారిని పోలీసుభటులకు నొప్పగించెను. క్రమముగ కేసు పూర్తియై పోలీసువారు మేజస్ట్రీటుగారియెదుటఁ బెట్టినవెంటనే విమర్శింపఁబడి దొంగలు నలుగురికి తలకొకయరడజను కొరడాదెబ్బలశిక్ష విధింపఁబడెను.

11. దెబ్బలు తిని పీతాంబరధరరావు తనయిల్లు సేరఁగనే—

ఆహాహా! పీతాంబరధరరావు! నీవింత

వాఁడ వై తివిగా! “ ఈదౌర్భాగ్యుని కింత దొడ్డపే రేల పెట్టిరి ? ఇదివరకు వీనిగుణకర్మ లు బహిర్గతములు కాలేదు. ఇప్పుడు బైటఁ బడ్డవి. కనుక వీని కింతమంచిపేరు తగదు. యోగ్యతతో ఈమంచి పేరు తిరిగి తెచ్చుకొనువరకు నితనికి—

“ పీతలరాయఁడు ”

అని పిలుచుటయే వీనికిఁ దగినప్రాయశ్చిత్తము ” ని పదిమందియును వానితండ్రియును ఏకగ్రీవముతోఁ జాటించిరి.

2 వ పరిచ్ఛేదము:—పీతలరాయఁడు.

12. ఇట్లు పీతలరాయఁడని పిల్వఁబడుచున్నను వానికి బుద్ధి రాదాయెను. తండ్రి మిగుల శోకించి బడిచదువులలోను, సాములలోను ప్రవేశపెట్ట సమర్థత లేక యొకపొరు

గుకరణముగారికి నొప్పగించి “అయ్యా! ఈ తీనుని తమసేవకునిగాఁ జేసికొని వ్రాఁతకోతల నేర్పి ఏషావుకారునొద్దనైనను పద్దుబట్టి వ్రాయుటకుఁ దగినవానిగ మప్పఁ” డని ప్రార్థించెను.

13. ఇప్పటికరణాలస్థితిగతులు 7-8 వందలసం॥లక్రిందట బ్రాహ్మణాలకు కరణీకములిప్పించిన గోపరాజు రామప్రధానికాలమందలివారిస్థితిగతులతోఁగానియిటీవలశ్రీకృష్ణదేవరాయలవారికాలపుమంత్రివరుల స్థితిగతులతోఁగాని పోలియుండవు. సోమేశ్వరునిపొరుగుకరణము ప్రస్తుతపుహెడ్డుకరణమునుగాదు, అసిస్టాంటుకరణమును గాఁడు. కరణాల కాదిలో నీబడినమిరాసీభూములకు క్విటెంటుకట్టఁబడఁగా వానిని బంచుకొనినమిరాసీక్విటెంట్రిం

టు యీనాందారుఁడు. ఇతనికి గ్రామకరణీకవృత్తి లేదు. కరణవంశములో నివాఁడై నిర్వ్యాపారుఁడై కూఁతకరణములలో ఘటకుఁడై యుండెను.

14. “పెట్టుపోఁతలు లేవు. అరణాలు లేవు. నోర్వెట్టుకు బ్రతుకవే నాతల్లికానా!” అనుసామెతనుబలుకుచు ఒక పేదరాలు తన కూఁతును దొలిసారి యత్తింటికిఁ బంపునప్పుడు బుద్ధులుసెప్పెనఁట. ఆప్రకార మీాతండు నోటిబూఁకరింపుచేత బ్రతుకువాఁడు. సాక్షీలలోను, కుటరిలలోను, వాక్పారుష్యములోను కన్నాకు. ఆయాయాసామీాలనడుమ వైరము, పగపుట్టించి రివిన్యూ, సివిల్, క్రిమినల్, కేసులలో సాక్ష్యము లిచ్చుచు నిప్పించుచుండును. ఇట్టికాపురుషునికి వాక్శుద్ధి లేదని వే

రుగఁ జెప్పనక్కఱలేదు. అవ్యక్తప్రిధానికి నవకతవక రాజు దొరకిన ట్లీపీతల రాయండను శిష్యునకు నీకూఁతకరణమనుగురువు సంప్రాప్తమాయెను. ఇట్టిదుర్భాగ్యపుగురువునొద్ద యాదిర్భాగ్యపుశిష్యుఁడు ౫, 6 సం॥లలో దస్తూరీ యనగ చేవ్రాఁత కుదరవ్రాయనేర్చి చక్కనిలేఖరి యాయెను. అనగ చేవ్రాత (hand) లేక దస్తూరి సొగసైనదికాని యతని మనసు మంచిది కాదు. గురువునకువలె శిష్యుఁడగునతనికింగూడ త్రికరణశుద్ధి లేదు. గురుకటాక్షముచేత దురభ్యాసములు దుష్టసంచారములు దుర్వ్యసములు క్రమంబుగ వైసుతో పేరుకొనుచుండెను. ఈప్రాయమున చుట్ట, బుల్లిచుట్ట (సిగరెట్) పొడుము, నల్లమందు, దమ్ము, "త్రాగుడు" మొదలగు చెడు

గులుగూడ వానికి నలవడెను.

15. మఱి రెండుమూడు సం॥రములలో తప్పుడుసాక్ష్యము, తప్పుడువ్రాఁతలలోను తీరి జీవనోపాధి సంపాదింప శక్తివంతుఁడాయెను.

I. "అమేధ్యముఁ దినుగేదెకు కొమ్ములు
గోసినను వెనకటిగుణము మానదు."

II. "కనకపుసింహాసనమున, శునకము
గూర్చుండబెట్టి శుభలగ్నమునం,
దొనరగఁ బట్టము గట్టిన, వెనుకటి
గుణ మేల మాను వినురా సుమతీ."

అనులోకోక్తులనుబట్టి ఆయాపోర్జరీ,తప్పుసాక్ష్యపుకేసులలో దండిగా డబ్బుదొరికి పండెము బారినకొలఁది ప్రవీణుఁడై తుదకు నొకగద్దుకేసులో తప్పుసాక్ష్య మిచ్చినందుకు మండలకరగ్రాహిగా రనఁగ డిస్ట్రిక్టు మేజస్ట్రీ

టుగాదికార్యస్థానమున విమర్శింపబడి నేరము పూర్ణముగ ఋజువై నెపపెట్టఁబడి యొక సం॥ము కఠినవరకపుశిక్ష నొందెను

16. పాశ్చాత్యపండితుఁడొకఁడు రచించిన పద్యము :—

"Oft we see the young beginner
Practise little pilfering ways,
Till, grown up a harden'd sinner
Hs in jail may end his days."

గీ. చిన్ననాఁటనుండి శిక్షయింతయు లేక
దుండగీఁడు చాల బండపనులు
క్రమముగాను జేసి కడుపాపియై చెర
సాలఁబడుచుఁ దుదకుఁ సమసిపోవు.

అనుపద్యప్రకారము దౌర్భాగ్యుఁడగు పీతలరాయుఁడొకసంవత్సరము కఠినవరక

మనుభవించి యిల్లు సేరెను.

**17.** వానిబంధుమిత్రులును ఇరుగుపొరుగు వారును వాని దుశ్చరితము విని వానింజూడ గనె కోప, శోక, మోహపరవశులై

ఈపీతాంబరధరరావు

ఆదిలో కొంతకాల మొకలాగున సంచరించి 10–12 ఏండ్లప్రాయమున చెడ్డనడతలో దిగఁబడి

"పీతలరాయఁడై"

తుదకు నేఁడు "పీతఁడ" య్యెననిరి. ఇంతలో నాగుంపులోఁ గలిసియున్న వానితండ్రి సోమేశ్వరుఁడు క్రోధావేశవివశుఁడై వీఁడు "పీతఁడే" సరిగా వీఁడు "పీతఁడే" ముమ్మాటికి వీఁడు "పీతఁడే" యని వానిని మూఁడుచంపకాయలు గొట్టివిడిచి శోకార్ణవమగ్నుఁడై యిల్లుసేరెను.

## III. పరిచ్ఛేదము—పీఠము.

18. నాటితుదమొదలు వాఁడానిర్భాగ్యపునామమును ధరించి శేషించినకాలములో దేహమనస్తాపములు హెచ్చి జీవన్మృతుఁడై యనగ బ్రతికియుండియుఁ జచ్చినవానివలె పడియుండెను.



## రెండవభాగము.

### జ్యేష్ఠాదేవతావిలాపము అనగ కనిష్ఠాదేవతావిలాపము.

1. ఈరెండవభాగము మొదటిభాగమునకు ఫలితార్థము. ఇందు జనులకు పెద్దమ్మకటాక్షమువలన నావహించుకీడు వదలిపోవుటచేత జ్యేష్ఠాదేవతావిలాపమనియు, మేలు, శుభముగలుగజేయుశక్తి పెద్దమ్మచెలియలు

చిన్నమ్మ (లక్ష్మీదేవి) దియను లోకోక్తినిబట్టి కనిష్ఠాదేవతావిలాసము లేక లక్ష్మీకటాక్షమనియు చమత్కారముగఁ బిల్వఁబడుచున్నది.

జ్యేష్ఠాదేవతావిలాపము=కనిష్ఠాదేవతావిలాసము.

2. ఎంతెంత పలుగాకులయియున్నను, బాలురకును, బాలికలకును బాల్యమునుండియు గురువులయొక్కయు సంరక్షకులయొక్కయు అదపాజ్ఞలు—క్రమశిక్ష (Disoipline) గలుగకగాని పనికిరాదు. వారు తమయొక్కయు తమతలిదండ్రులయొక్కయు పూర్వజన్మసుకృతముంబట్టి సుగుణసంపత్తి గలిగి కృతకృత్యులై మేలుగాంతురు. ఇందుకు మూడుదృష్టాంతములనగ ముగ్గురుబాలురకథ లీక్రింద

వివరింపఁబడుచున్నవి.

I. ఈక్రిందిగ్రంథాంతరము (కొలేపర్) E.E. కల్లెటు, ఎమ్ఎ పండితుఁడు వ్రాసిన కోల్రిజ్ కవిజీవితమునుండి తర్జుమాచేయబడెను.

స్యామ్యుయల్, టేలర్ కోల్రిజ్ :—" ఇతం డింగ్లాండునందు డివాన్ షైరను మాగాణము నందు ఆటరి (Ottary) యనుకిరస్తాన్ పేటలో ఆన 1772 సం॥ 21 అక్టోబరు తేదీని పుట్టెను. ఇతనితండ్రి యాపేటలోనుండు జనులకు మత బోధకుఁడు. మఱియు నచ్చటిధర్మవ్యాకరణపాఠశాలకు నుపాధ్యాయుఁడు. ఘనుఁడగు పండితుఁడును, పక్కా పెద్దమనుష్యుఁడును. అయితే చంచలత. పరాకుగలవాఁడు. తల్లి చదువు రానిదైనను లోకానుభవముగలజాణ.

ఈదంపతులకొడుకు కోల్రిజ్ తనయీాడు

కు మించినబుద్ధిశక్తి కల్పనాశక్తిగలవాఁడు. తనజతగాండ్రతో బాలబోధకము.లగుఅరేబియన్ నైట్సు, రాబిన్సన్ క్రూసోకథలు వానికి మూఁడవయేటివయస్సునందే తనతోటిబాలురకంటె వానిమనస్సునకు నాటి గాఢతలంపులు పుట్టించెను. అప్పటినుండియు భయంకరమైనట్టియు పాడుగానుండెడునట్టియు ఘోరముగుతలంపులుగలవాఁడాయెను. తన ఆరవసంవత్సరమునం దెనదరువ్యాకరణపాఠశాలలోఁ జేరి తనపోటికాండ్రను మించెను. అయితే అతని తండ్రి క్రీ.శ. 1781 సం॥ మరణించెను.ఆమరి సం॥మందే లండన్వట్టణపు క్రీస్తుధర్మశాలకు నంపబడెను, ఆపాఠశాల ఆరవఎడ్వర్డుప్రభువుచేత స్థాపింపబడినది. అచ్చట శిఫార్సులు పొందినగొప్పవారిబిడ్డలు ధర్మముగాఁ జేరుదు

రు. అచట బాలురతో కోల్రిజ్ చేరెను. వారు తదనంతరము ప్రసిద్ధిగాంచిరి. ఇలియాయను వానిపేరట రచించబడ్డ యమృతోపన్యాసములు వ్రాసినఛార్లెస్ ల్యాంబ్ (Lamb) వారిలో శ్రేష్ఠుఁడు. ఆయుపన్యాసములలో రెండు ల్యాంబ్, కోలిరిజ్ యనుబాలురు పరస్పర స్నేహితులైనందున వారి యప్పటిపాఠశాలా పరిచారములతో సంబంధించుచున్నవి. ఆపాఠశాలాపరిధానోపాధ్యాయుఁడు బోయెరని పిల్వఁబడుచున్నాడు. ఈతండు తనశిష్యులను బడితెపూజాచేయుటలోఁ బ్రసిద్ధుఁడు. ఈయన గారివిషయమై

" నయమెంతపాపజాతియో

భయమె నూపింపవలయు పృథ్విజనులపై"

అను లోకోక్తిప్రకారము లోకులకు "బడితె

బాజాయే'' తగినశిక్ష (యుపాయము) యని యోచించువాఁడైనట్లు డిక్వెన్సీకవి చెప్పుచున్నాఁడు. అయితే బోయరుగురువుయొక్క కాఠిన్యము బయటి కంతగా కోలిరిజ్ మీఁద చూపబడ లేదు. ఆమహామహోపాధ్యాయుడు పెంకిదిప్పకాయపిల్లఁడగుకోలిరిజ్ కి పాతచెప్పులుకుట్టుకొనిబ్రతుకుమాదిరి వానియొద్దఁ మేజువారి పనిచేయు దురోద్యోగము గలుగకుండ రూఢిగ వానిందప్పించెను. మఱియొకప్పు డీపెంకిబాలుడు దుర్మతపరివర్తకుఁడై నాస్తికుడనై తినని చెప్పుకొనుచుండగఁ గనిపెట్టివానిని దుడ్డుకఱ్ఱతో గట్టిగమోది, వానితిక్కజాడ్యము నిర్మూలముఁజేసెను. తర్వాత ఎంతకాల్పనికముగనుఁ ఎంతబహువిషయికముగను వాడుచదువులభ్యసించినను కోల్రిజ్ యామహామహోపాధ్యా

యుని ఖచితమైన తర్ఫీతుచేత మంచి విద్వాంసుఁడయ్యెను."

ఇట్టిరీతిని విద్వత్తులోఁ బ్రసిద్ధిగాంచి మంచి మంచి యాంగ్లేయగ్రంథములువ్రాసి మిక్కిలి ప్రసిద్ధికెక్కిన తోటికవులలో వన్నెకెక్కి 62 సం॥లుజీవించి 1834 సం॥న కోల్రిజ్ స్వర్గస్థుఁడాయెను. వీనివిద్వత్తునకును మతసంస్కరణకును మెచ్చి ఇంగ్లండురాజు 4 వజార్జిగారు వందగిన్నీలుచా॥ వార్షికమిచ్చిరి. ఈకథవలన దుస్సాంగత్యముయొక్క నీచత్వము, సత్సాంగత్యముయొక్క ఘనత స్పష్టముగఁ దెలియుచున్నది.

II. డాక్టరుస్యామ్యుయల్-లి-అనువాఁడు:—ఈమహానుభావుడాంగ్లేయదేశములోనిష్రాప్షైరులోనొకపల్లెయందు క్రీ.శ. 1?73సం॥న

జన్మించెను. ఇతఁడు బీదబాలుఁడగుటచేత నొక
ధర్మపాఠశాలయందు కొంతకాలము చదివి గ
తిలేక యొకవడ్రబత్తునియొద్ద వడ్రపుపనిచేయ
నేర్చుటకు నారంభించెను. ఇతఁడు పట్టుదల, స్వ
సహాయము, స్వాతంత్ర్యవిశ్వాసము (స్వశ
క్తిసమ్మకము) శ్రద్ధ మొదలగుసుగుణసంపత్తి
గలవాఁడు. కాబట్టి స్వయంకృషిచేతనే యే
కాంతమున చదువనారంభించెను. ఇతఁడనేక
ప్రాగ్దేశభాషలలోనేగాక పశ్చిమదేశభాషల
లో పాండిత్యము సంపాదించెను ;. ల్యాటిన్,
గ్రీక్, చాల్డేయిక్, సిరేయిక్, అరేబిక్,
పరిషియన్, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్,
అను పదిభాషలలో పరిజ్ఞాతయై క్రీ.శ. 1817
సం॥లో కేంబ్రిడ్జికలాశాలలో పట్టపరీక్షయం
దు కృతార్థుడై యచటనే 1819 సం॥ అరే

బిక్ భాషా ప్రొఫెస్సరుఅయెను.పిమ్మట 1831 లో హీబ్రు ప్రొఫెస్సరుగానియమించబడెను. హిబ్రూలో వ్యాకరణము వ్రాసెను.ఇంతయె గాక మరికొన్ని భాషలలోని గ్రంథములు తర్జుమాచేసెను. మరియు బైబిలుసమాజమువారి కింగూడ భాషాంతరకరణములతో సహాయమొసర్చెను. కీర్తిశరీరుడైన యీబుద్ధిశాలి క్రీ.శ. 1852 సం॥ స్వర్గస్థుడాయెను. (పైకథ బీటన్స్, యూనివర్సల్ నిఘంటులోనుండి సంగ్రహించబడినది.)

ఈక్రిందిది ద్వాపరయుగచర్య.

III.ఏకలవ్యుఁడనువాడొక యెఱుకవాఁడు. అతఁడు విలువిద్య నేర్పుమని ద్రోణాచార్యు నడిగెను. "నీకువిద్యనేర్పిన యెడల జంతువులను చంపుదువు, ఆపాపము నాకువచ్చును. గనుక

నేను నీకుఁజెప్పను." అని ద్రోణాచార్యుఁడు త్తరమిచ్చెను. ఏకలవ్యుఁడడవికింబోయి మంటితో ద్రోణాచార్యునివలె ప్రతిమను జేసి యుంచుకొని ప్రతిదినము దానిని పూజించుచుండెను. ఆబొమ్మయే తనకు విద్య నేర్పుచున్న ట్లెంచుకొని విలువిద్య శ్రద్ధతో నలవాటు చేసికొనెను. ఈయభ్యాసముచేతను ద్రోణుని యందుగల భక్తిచేతను ఏకలవ్యుఁడు ద్రోణాచార్యునికి ముఖ్యశిష్యుడగు నర్జునునికంటె విలువిద్యయందు నేర్పరియయ్యెను. విద్యలందు తీరుటకు శ్రద్ధయును, గురుభక్తియునుముఖ్యసాధనములు. (ఆర్యకథానిధి 19 వకథ)

**3. (A stitch in time saves nine)** అనగా బట్టచినిగినప్పుడు తరుణములోబడిన కుట్టు తొమ్మిదికుట్లు నాపివేయు నను నాంగ్లే

యసామెతనుబట్టి తరుణములో పిల్లలతప్పు సరిగ దిద్దుట మహాభాగ్యము.

4. కీర్తిశేషులైన గురజాడ కొండమంత్రి శేఖరుఁడు గొప్పయనుభవజ్ఞానముతో జెప్పిన దేమనగ :— వెదురుబిడెములో నొకబోఁడు లేక పిలకపుట్టి పెరుగుచున్నపుడు ఆయాతరుణములు గనిపెట్టి వంపులువంచి పాలకీబొంగుగా తీర్చి చెంచువాఁడు తయారుచేయును. దానినే పెండ్లిపాలకీకి నమర్చినవెంటనే చాకలివాండ్రు పాలకీని సంపాదింతురు. ఆబొంగూ రేగింపులలో పెండ్లికొడుకు పెండ్లికూతులకు వాహనమైనపాలకీకి శిరోభూషణమై ధగద్ధగాయమానముగ మెఱయుచు నౌన్నత్యము నొందును. ఆవెదురుపిలకయే పుట్టిననాట నుండియు ధేచ్ఛగాఁ బెరగనిచ్చిన యెడల దొమ్మ

రిసానికాలిక్రిందగడయో, శవవాహకునిభుజ దండమో, గడ్డికావటివాని కావటిబద్దయో, పందిలిరాటయో, పందిలివాసమో, తడకబద్దయో, మైచీక నశించును. అదునుపదునెరింగి వంచినతప్ప బాలురును బాలికలును పనికి రారని యాకొండమంత్రీంద్రుని యభిప్రాయము.

5. కీర్తిశేషులగుమాతండ్రి పెద్దాడ వీర రాజామాత్యులు నేటికి రమారమి యరువది సంవత్సరములక్రిందట బడిపంతుళ్ళకాలములో మాయన్నదమ్ములు 6 గురబాల్యావస్థలలో సాకుట్టవిషయము సంభాషించునపుడు మాకును, మాబడిపంతుళ్లకును మాయిరుగుపొరుగువారలకును నాటులాగున "నేయిగారం బెట్టవలయును.

చెమటగారఁ గొట్టవలయును.

అనుసామెతను చెప్పుచుండెడివారు. ఇప్పటి నవనాగరికులచెవి కింపుగనుండకపోయిన నీ మోటుసామ్య మిప్పటి సున్నితవు(దురంతపు) చదువులకు నమరియున్నది. దీనియర్థము శాంతచిత్తముతో గ్రహించి యిప్పటిసుకుమార జనులు క్షేమపడుదురుగాక.

6. ఈక్రిందిది నీతిబోధకమగు నొకకంద పద్యము :—

క. ఆలిని హయమును గజమును
బాలునిబాలత్వమునను బనిగొనకున్నన్
ఆలి చెడుహయముగరుచును
జాలఁగ మదమెక్కుఁగరికి బాలుఁడువలుగా

ఈపద్యము నా బాల్యావస్థలో నేర్చుకొంటిని. నేను పదివన్నెండేళ్ల ప్రాయమందు నామాతా

మహులు మంత్రివేదాంతశాస్త్రప్రవీణులు ను కీర్తిశేషులు నగుబుద్ధిరాజు కనకరాజా మాత్యులతో సంభాషించుచుండగ నొకనా డీపద్యము మాటలవెంబడిని జదివిరి. ప్రవర్త నవిషయములో నొకమాదిరిమంత్రమువలె నీపద్యము నడుచుచున్నది. పీఠికాపురసంస్థాన వర్తమానప్రభువు లగుహిజ్ హైనస్ శ్రీరాజా రావు వేంకట మహీపతి సూర్యారావు బహద్దర్ ప్రభువువారుబాల్యావస్థ(Minority) యందు నాతరబీయతులోనున్నపు డొకనాడు ప్రస్తావవశమున నీపద్యముం జదవగా మిగుల నాదరముతో దీనిం గైకొనిరి.

7. సత్వగుణప్రధానులై యీనూతనగ్రంథమును మాచదువరులు చదివి ఈక్రిందిశ్లోక ములో మహేశ్వరుడు విషమును కంఠమం

దు దాచి చంద్రుని శిరస్సున ధరించినరీతిని దోషములను త్యజించి గుణములనే గ్రహింతురుగాక. శ్లో.॥గుణదోషౌబుధోగృహ్ణన్నిందుక్ష్వేళా వివేశ్వరః, శిరసాశ్లాఘతేపూర్వంపరంకంఠేనియచ్ఛతి"

8. ఇంకొకమాట :— ఈగ్రంథముయొక్క ప్రథమభాగ ప్రశిద్ధి కయగుసామెత(Proverb) కథానాయకుడగు పీతనికి చక్కగ నమరియున్నదని నాయభిప్రాయము.

సమాప్తము.

ఇట్లుబుధజనవిధేయుఁడు

పెద్దాడ చిట్టిరామయ్య,

గ్రంథకర్త.

## ఈగ్రంథముంగూర్చి పండితాభిప్రాయములు.

I. "మీరొసంగిన × × × వ్రాతప్రతి జదివితిని. మోటుసామెతలేమి! ఇందలినీతి జెంపకాయగొట్టి బుద్ధి జెప్పినట్లు బోధించియున్నారు. × × ×"

26-4-16. (Sd.) M. Parvatesam,
(Sub Assistant.)

---

II. "× × × ఈగ్రంథమును నే నామూలాగ్రముగఁ జూచినాను. మంచినీతిని బోధించుచున్నది. నవ్వు పుట్టించుచున్నది. గ్రామ్యపదములుకొన్ని పరిహరించిన మిక్కిలి బాగుండునేమోయని తోచును. × × ×"

13-10-16. (Sd.) పు॥ పం॥ మల్లయ్యశాస్త్రి,
(సంస్థానపండితుఁడు.)

---

III. "× × × అనుపుస్తకము చూచినాఁడను.

విపులలోకానుభవముగలిగిన గ్రంథకర్తగారు వ్రాసినకథ లు చరిత్రములు బాలురకు నీతిదాయకములుగనున్నవి."

పిఠాపురము.
27-9-17.

(Sd.) కూచి నరసింహము,
Head Master,
R. Ch. High School.

---

IV. "ఈ గ్రంథము నీతిదాయకమై బాలురకును బాలికలకును జదువుటకు మిక్కిలి యుత్సాహముగ నుండును × × ×"

26-9-17.

(Sd.) వే. వేంకయ్యశాస్త్రి.

